శ్రీః

# శ్రీరామావతారతత్త్వము

## నాల్గవప్రకరణము.

ఇయ్యది

కడప మ్యునిసిపల్ హైస్కూలునందు ప్రధానాంధ్రపండితుండగు
కావ్యస్మృతితీర్థ
జనమంచి శేషాద్రిశర్మవిరచితము.

వెల
౨




చెన్నపురి:
"వావిళ్ల" ముద్రాక్షరశాలయందు
ముద్రితము.
1933

మించుగ సగముభాగ మయినదనవచ్చును. అధ్యాత్మ రామాయణమునఁ గలవిశేషములును నిందుఁ జర్చింపఁబడినవి. ఇతర పురాణములయం దీకథాభాగము విశేషించి చర్చింపఁబడనందున వాని నిందుఁ గైకొనలేదు. ముందుముందు, వానిం గలిపికొని, గ్రంథమును సాగింతును. ఈ నాప్రయత్నమునకు మహానీయులు, కొందఱు తోడుపడిరి. వారికెంతయుఁ గృతజ్ఞుఁడను. ఈప్రయత్నము కడుంగడుం బెద్దదియగుట ధనముకూడ మిక్కిలిగఁ గావలసియుండుట పెద్దలకుఁ గ్రొత్తదికాదు. దానిని జేకూర్పవలసినభారము శ్రీరామచంద్రునిదిగాని నాదికాదు. ఇందు విశేషించి స్మర్తవ్యులు సనాతనాధునాతనభాషోద్ధారకులు మ-రా-రా-శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు. వారికేనెంతయుఁ గృతజ్ఞుఁడను. ఆంధ్రపత్రికాధిపతులు దేశోద్ధారకులు విశ్వదాతలునగు మ-రా-రా-శ్రీ, కాశీనాథుని నాగేశ్వరరావుగారును, కృష్ణాపత్రికాధిపతులును స్మర్తవ్యులు. వారిసాయమపారము కొందఱు కాలగతింబట్టి యీసంపుటము మూల్యము నొక్కరూప్యముగాఁ జేయఁదగునని నాకుం దెలిపిరి. పోషకులును, జందాదారులును, మఱికొందఱు చేరినఁగాని యట్లుచేయ సాధ్యముకాదు. ఈవిషయము నేను దెలుపకయే తెలియవచ్చుచుండును. ఈకార్యము తమకార్యమని భావించి నాలోపముల మన్నించి తెలుపఁదగువిషయములు నాకుం దెలిపి నాచేతనే వ్రాయించి నన్ను ధన్యునిఁ గావింతురని సాధువులఁ దలయొగ్గి వేఁడుచున్నాఁడను. ఇంతకంటె విశేషించి వ్రాయఁదగినవి కనఁబడవు.

ఇట్లు విన్నవించు
సాధుజనపాదసేవకుఁడు
జనమంచి శేషాద్రిశర్మ.

# ఉద్ధారకులు

ఆనరబుల్ దివాన్ బహాదూర్ బి. మునుస్వామినాయండుగారు,

బి. ఏ. బి. యల్., చిత్తూరు.

మ-రా-శ్రీ, మడిపల్లి సూర్యనారాయణమూర్తిగారు, అరవిల్లి, ప॥ గోదావరి.

,, అయ్యగారి బుస్సెట్టప్పగారు, కణేకల్లు, బళ్లారి.

# పోషకులు.

మ-రా-శ్రీ, అక్కిన ప్రగడ లక్ష్మీనారాయణరావుగారు,

ఇంజనీయరుగారు, ఏలూరు.

,, జేచిరాజు రామరావుగారు, గుంటూరు.

,, కే. టి. వి. ఆర్. నరసింహస్వామిగారు, దొమ్మేరు, ఉపా

,, నోరి శ్రీరామమూర్తిగారు. ,, ధ్యాయులు, ప॥ గోదావరి.

,, సుంకర సుబ్బయ్యగారు. ,,

,, కలగ నరసింహముగారు, కోవూరు.

,, నరసింహదేవర వేంకటశాస్త్రులుగారు.

,, పైడా రామకృష్ణయ్యగారు, జమీందారులు, కాకినాడ.

,, బొమ్మిసెట్టి లక్ష్మీనరసింహస్వామిగారు, నెల్లూరు.

,, వెలంపల్లి రామకృష్ణమ్మశ్రేష్ఠిగారు. ,,

,, వత్తి గురుమూర్తిశ్రేష్ఠిగారు, నెల్లూరు.

,, దరిమడుగు చలమయ్యగారు. ,,

,, కోట వేంకటరామయ్యసెట్టిగారు.

,, బచ్చు చంద్రమౌళిగారు. ,,

,, దోగుపర్తి వేంకటసుబ్బారావుగారు. ,,

,, అల్లాడి జగన్నాథశాస్త్రులుగారు, బి. ఏ, ఎల్. టి. హెడ్మా

ష్టరు, వి. ఆర్. హైస్కూలు, వేంకటగిరి టౌన్.

,, జంగా లక్ష్మీనరసింహశాస్త్రులుగారు, ఉపాధ్యాయులు, కడప.

,, వత్తి రాఘవులుశ్రేష్ఠిగారు. ,,

మ-రా-శ్రీ, బత్తులపల్లి శేషగిరిరావుగారు, రామరాజుపల్లె, కడప.

,, శాస్త్రపాటి చలపతిరావుగారు, కడప.

,, సముఖము శ్రీనివాసులునాయుండుగారు, ఇంగ్లీషు హెడ్ అకౌంటెంటు.

,, దేవరకొండ సుబ్రహ్మణ్యముగారు.

,, పుట్టమురెడ్డి చలమారెడ్డిగారు, పంచాయతిప్రెసిడెంటు, మంటపం పల్లె.

,, ఆకేపాటి తిరుమలరెడ్డిగారు, తా॥ బో॥ మెంబరు, గ్రాము మునసబు, సెందలూరు.

,, పురిగండ్ల చెంగయ్యగారు, నాదరు, సెందలూరు.

,, యాదాళ్ల బాలసుబ్బయ్యశ్రేష్ఠిగారు, బెడుసుపల్లె.

,, నిట్టూరు లక్ష్మీనారాయణరావుగారు, బి. ఏ., ప్లీడరు, గుత్తి.

,, సిద్దవరం వేంకటసుబ్బయ్యగారు, బి. ఏ., ,, ,,

,, వి॥ కొప్రేశాచార్యులుగారు, బి. ఏ. బి. ఇ. డి.

,, ఆర్కాటు వేంకోబరావుగారు, హెడ్ మెనరు.

,, ఎస్. సుబ్బరావుగారు, బి. ఏ., ప్లీడరు.

,, ఉప్పర్లపల్లె రంగాచార్యులుగారు, పండితులు.

,, వై. కొండలరావుగారు, ఉపాధ్యాయులు.

,, ఓ. ఐ. శౌరిరెడ్డిగారు, ఎం. ఏ., బి. ఎల్, వకీలు. తా॥ బో॥ ప్రెసిడెంటు.

,, కే. వేంకటేరావుగారు, అనుంపల్లె.

,, మొలకతాళ్ల చిన్నపుల్లయ్యగారు, గాండ్లపాడు.

,, రాచర్ల తిప్పయ్యగారు, బెళగుప్ప.

,, కరణం కృష్ణరావుగారు, బేవినహాళ్లి.

,, బి. రంగాచార్యులుగారు, కిరికెర.

,, కే. లింగప్పగారు, కరణం, కిరికెర.

మ-రా-శ్రీ, గాదంసెట్టి సుబ్బయ్యశ్రేష్ఠిగారు, తిరిచెర.

,, కట్టా ఆత్మారామయ్యశ్రేష్ఠిగారు, హిందూపురము.

,, కట్టా మాధవయ్యగారి నారప్పశ్రేష్ఠిగారు. ,,

,, మాకం సీనయ్యగారి నారాయణయ్యశ్రేష్ఠిగారు.

,, కే. ఎస్. రాఘవాచార్యులుగారు, బి. ఏ., బి. ఎల్., ప్లీడరు. అనంతపురము.

,, మానేపల్లి నారాయణరావుగారు, వకీలు, అనంతపురము.

,, శ్రీకంఠం సుబ్బయ్యగారు, ఆంధ్రవిశ్వకళాపరిషత్సభ్యులు.

,, విట్టా శేషప్పశ్రేష్ఠిగారు, బళ్లారి.

,, రావుసాహేబు జే. పాపయ్యశ్రేష్ఠిగారు, బళ్లారి.

,, బళ్లారిసెట్టి రంగబ్రహ్మానాయడుగారు, బి. ఏ., తహశీల్దారు, బళ్లారితాలూకా.

,, చెరుకూరు భీమప్పగారు.

,, శ్రీమతి వై. ఛాయాంబగారు. [దారు, బందరు.

,, జిడ్డు లింగయ్యగారు, బి. ఏ., బి. ఎల్., డిస్ట్రిక్టుకోర్టు శిరస్తా

,, పుల్లెల వెంకటరమణయ్యగారు, ఇచ్ఛాపురము.

,, కే. జోగయ్యగారు, మదరాసు.



# విషయసూచిక.

శ్రీః.

# శ్రీ రామావతారతత్త్వము

## అయోధ్యాకాండము.

### చతుర్థప్రకరణము.

---

#### దేవతాస్తవము.

శ్లో. రామం చందనశీతలం క్షితిసుతామోహాకరం శ్రీకరం
వైదేహీనయనారవిందమిహిరం సంపూర్ణచంద్రాననం,
రాజానం కరుణాసమేతనయనం సీతామనస్స్యందనం
సీతావక్త్రసుచారుగండతలగేహం వందే సదా రాఘవమ్. ౧

రామం శ్యామాభిరామం రవిశశినయనం కోటిసూర్యప్రకాశం
దివ్యం దివ్యాస్త్రపాణిం శరముఖశరధిం చారుకోదండహస్తం,
కాలం కాలాగ్నిరుద్రం రిపుకులదహనం విఘ్నవిచ్ఛేదదక్షం
భీమం భీమాట్టహాసం సకలభయహరం రామచంద్రం భజేహమ్. ౨

రామచంద్రచరితాకథామృతం లక్ష్మణాగ్రజగుణానుకీర్తనం,
రాఘవేశ తవ పాదసేవనం సంభవంతు మమ జన్మజన్మని. ౩

రామో మత్కులదైవతం సకరుణం రామం భజే సాదరం
రామేణాఖిలఘోరపాపనిహతీ రామాయ తస్మై నమః,
రామాన్నాస్తి జగత్త్రయైకసులభో రామస్య దాసోస్మ్యహం
రామే ప్రీతిరతీవ మే కులగురో శ్రీరామ రక్షస్వ మామ్. ౪

శ్రీరామచంద్ర తవ కీర్తిసురద్రుమస్య
తారాగణస్సుమనసః ఫలమిందుబింబమ్,
మూలం ఫణాపతిగతం గగనం చ మధ్యం
శాఖాదిశో భువనమండలమాలవాలమ్. ౧

(శ్రీరామకర్ణామృతము.)

భక్తవర్యులారా! సత్యాన్వేషణతత్పరులారా!

శ్రీరామావతారతత్త్వమునందలి మూఁడవ ప్రకరణమును భక్తిమెయి మీసన్నిధానమున సమర్పించుభాగ్యవిశేషము నాకుఁగలిగినది. ఆప్రకరణమున దశరథమహారాజు శ్రీరామాభిషేకసువార్తను బ్రజలకుఁ దెలుపుట యనునది మొదలు పరమేశ్వరుఁ డడవికిఁబోవ నంగీకరించినంతవఱకుఁ గలకథలు గలవు. సకలసదాచారప్రబోధకములగు నాకథావిశేషములఁ బఠించినకతన భగవంతునిమాహాత్మ్యమును, లోకుల కెట్లు న్యాయమును స్వప్రవర్తనమునఁ దెలిపినపద్ధతియు మంథరాకైకయరాజపుత్త్రికలచరిత్రసారము, వారెందులకయి యట్లు ప్రవర్తించినదియు మీరు తృప్తిగా గ్రహించియే యున్నవారనియే నావిశ్వాసము. శ్రీరామచంద్రమూర్తియు మహామాయ యగుసీతయుఁ బ్రపంచమున ధర్మసంస్థాపన మెట్లెట్లు చేయఁ బూనినదియుఁ దేటతెల్లముగా నాప్రకరణము మీకుఁ దెలుపును. ఒక్కధర్మమును శాశ్వతముగా నిలుపంబూని యెవ్వ రెవ్వ రెంతెంతకష్టములపాలైనదియు నించుక పరికించిన స్పష్టము కాకపోదు.

తఱచుగా లోకులలోఁ గొందఱు మంథరను గైకను దూఱుదురు. అది మిగులఁ బ్రమాదమని యాప్రకరణము

బోధించును. ఎన్ని లోకాపవాదములు తమ్ములముకొనినను, ఎందఱెన్నిరీతులఁ దమ్ము దూషించినను వానిని లెక్కసేయక భగవదాశయమగు ధర్మరక్షణమహాకార్యమును లక్ష్యముగా నిడికొని దేవమునీంద్రుల యానతిని శిరసావహించి వారు తమ పనులఁ జక్కఁగా నిర్వహించిరని మన మెఱుఁగవలయును. అల్పబుద్ధు లొనరించు స్తుతులు దూషణములు నచిరకాలమున లయము నొందును. భగవదాజ్ఞ శాశ్వతానంద మొసంగునదమ్ము నొసంగునదియే యగును. కావున నద్దాని యథామతి నొనరించి లోకములకు ధర్మమునకును మహోపకార మొనరించిన వారు కైకయును మంథరయు నని స్పష్టమగును. అట్టివారిని యాథార్థ్య మెఱుంగక దూషించుట పొరపాటుగాక మఱే మగును? తమ్మూలమునఁగాని భగవంతున కరణ్యగమనము పొసఁగదు. అది సాగినఁగాని దుష్టదానవసంహారము, శిష్టపరిపాలనము సాగింప వలనుపడదు. పట్టాభిషేకమహోత్సవము సాగియుండినఁ గొందఱకే యానందము కలుగును. అట్టి యానందమున కడ్డుపడినవన్న కారణమున మంథరను కైకను నిందింపవలయునో, ముల్లోకములకు మహోపకార మొనర్చ సాధనమైరన్న కారణమున స్తుతింపవలయునో మహామతులే యూహింపఁగుదురు. నీవు లేకయున్న భగవత్కార్యము సాగదా యనువారు కొందఱు గలరు. ఇంకొక్కఁడు నిమిత్తముగా నుండవలయును. నిమిత్తము లేకయున్నఁ గార్యమే సాగదు. "నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" అని భగవంతుఁడే యుపదేశించెను గదా. "నహి కారణం వినా కార్యస్యోత్పత్తిః" అన్న న్యాయము సుప్రసిద్ధము కదా. ఇన్ని కారణములంబట్టి యాలోచింపఁగా నేకారణమును బట్టి వారు నిందింపఁబడుచున్నారో ఆ కారణమును బట్టి

చక్కఁగా నాలోచించిన వినుతింపఁదగినవారే యని తోఁచక మానదు. ఈవిషయము మహాకవి వాల్మీకిమహర్షి యాయాస్థలముల సూచించెను. ఆవిషయము నందందు వ్రాసితిని. శ్లోకములకు నేను వ్రాసినయర్థము క్రొత్తవి కావనియు సుసంగతములనియు నిష్పక్షపాతమతిం బరికించినచో సుస్పష్టమగును. శరణాగతినే రామాయణము తెల్పుచున్నదని వ్రాసినవ్యాఖ్యాతలభావము లిట్టివే యని గ్రహింపవలయును.

కొందఱు మధ్యవైష్ణవులు తమకుఁగల దుర్మతాభిమానావేశమువలన దేవతాసమత్వమును దూషించుచు "తాఁబట్టిన కుందేటికి మూఁడేకాళ్లను" సామెత నుదాహరణభూతముగ శ్రీరామచంద్రునకుఁ బరమేశ్వరత్వము స్థాపించుచున్నామనుకొనుచు దానిని బాఁటిఁదోలుచున్నారు. విష్ణుసర్వోత్తమత్వమును దమరు స్థాపించుట కెట్టికారణములుగలవో యితర క్షుద్ర దేవతలసర్వోత్తమత్వమును స్థాపించుట కితరుల కట్టికారణములే కలవు. అసూయ వారిమదినిలిచి రాజ్యము సేయుచున్నందున వారి కితరులు చూపినప్రమాణములు రుచింపకయుండును. శ్రీరామతారకోపాసకుఁ డీశ్వరుఁ డన్నపుడు తమకు సంతోషముకలిగినట్లే శివతారకోపాసకుఁడు రాముఁడన్నపు డితరులకు నట్టిసంతోషమే కలుగునన్నసద్వార్తను వారెఱుఁగరు. అన్యదేవతాదూషణమునఁ గలుగునది పాపమేగాని వేఱుభాగ్యము లభింపఁబోదు. బాహ్యచిహ్నములు భక్తిని దృఢపఱచుటకుఁ బనికిరావు. కొన్నిచిహ్నములుండినఁగాని భగవంతు నారాధింప నర్హులు కాఁజాలరన్న వారలకంటె నజ్ఞులు వేఱెవ్వరు? మనస్సు నిర్మలమైనఁగాని భగవదారాధనము సంపూర్ణఫలము నీయఁజాలదు. బాహ్యచిహ్నములు దాంభికత్వమునే వెలిపుచ్చును

గాని వేఱుఫలము వానివలనఁ గలుగఁబోదు. తోలుదోలుతఁ గేవలమూఢుల కవ్వి పనికివచ్చునన్న నొకప్పు డౌనవచ్చును. కాని వానివలనిఫల మత్యల్పము. క్రమముగా నాచిహ్నములు పరమతదూషణమునకుఁ బురికొల్పును. శ్రుతులవ్వానిని బోధింపవు. పురాణములుకూడ నవ్వాని కవకాశమును గల్పింపవు. కొందఱకుఁ దచ్చిహ్నధారణప్రోత్సాహకులకు ధనలాభము కలిగినఁ గలుగును. కాని యాధనము వారిప్రకోభివృద్ధికి నంతరాయమునే కల్పించును. కాని తరణోపాయమునకు దారిచూపవనుట సిద్ధాంతము.

భగవంతుఁడు శ్రీరామమూర్తిగా నవతరించి భూభారహరణరూపమగు ధర్మమును స్థాపింపఁబూనఁగా నాపరమేశ్వరు నారాధించి కృతార్థులు కాఁదగువా రందఱో యాపరమాత్మ నాశ్రయించిరి. వారివారికర్మముల ననుసరించి యాభగవంతుఁడు వారికి ఫలముల నొసంగును. అంతియకాని యెల్లరకొకేరీతిగా ఫలము నీయఁబూనఁడు. అది పక్షపాతము కాదా యనరాదు. కర్మము ఫలమునిచ్చును. కర్మమే భగవత్స్వరూపము. దాని నారాధించుపద్ధతు లనేకములు. అందు ధర్మమార్గము ననుసరించి సత్కర్మముల నాచరించుచు వానిఫలములనుగోరక యుండువారలను బరమేశ్వరుఁడు రక్షించును.

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్."

అన్న దేకదా భగవంతుని ప్రతిజ్ఞ. "అనన్యాశ్చింతయంతః" అనఁగా "నితరదేవతల నారాధింపక వారినెల్ల నల్పులనుగా భావించి" అని కొందఱర్థము చెప్పుదురు. సెబాసు. చాలబాగు

న్నది. అట్టివారే మధ్యవైష్ణవులని, మధ్యశైవులని, మధ్యశాక్తులని యిందుఁ బేర్కొనఁబడుదురు. సర్వదేవతాస్వరూపునిగా ననఁగాఁ బరమేశ్వరునిగా సర్వకారణునిగా నన్ను దలఁచువారలెవరో

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః."

అన్నగీతావాక్యము ననుసరించి యెవరు సర్వము నన్నుగాఁ జూతురో వారు ఫలాభిసంధిరహితసత్కర్మాచరణపరులు. కాన వారిని నేనే రక్షింతునని భగవంతుఁడు పలికెను. ఈభావము గలిగిన మతద్వేషమునకుఁ జోటులేదు. దేవతాంతరదూషణమున కవకాశమే లేదు. అట్లుగాక మా రాముఁడే గొప్పవాఁడు. మా శంకరుఁడే యధికుఁడు అని యూహించువారలు భగవత్కరుణకుఁ బాత్రులు కాఁజాలరు. పామరులే యగుదురు. సర్వశబ్దవాచ్యుఁడు కదా భగవంతుఁడు. మా రాముఁ డనఁగా నర్థమేమి? అహంకారస్వరూపుఁ డీమానవుఁడని యేకదా దాని యర్థము. ఎల్లరకుఁ బరమాత్మ సమానుఁడే. సర్వసాక్షి. కరుణాస్వరూపుఁడు. అట్టిమహాత్ముని నహంకారమున సాధించిన ఫలము శూన్యమే యగును. భగవంతుఁడు మానవుని బాహ్యచిహ్నములను జూడఁడు. పవిత్రమగుమనస్సునే చూచును. అన్నబుద్ధుని హితోపదేశ మెంతబాగున్నదో చూడుఁడు.

"స్థితిః పుణ్యారణ్యే సహపరిచయో హంత హరిణైః
ఫలైర్మేధ్యావృత్తిః ప్రతిదివసతల్పాని దృషదః,
ఇతీయం సామగ్రీ భవతి హరిభక్తిం స్పృహయతాం
వనం వా గేహం వా సదృశముపశాంత్యైకమనసామ్." 33

(వైరాగ్యశతకము.)

అన్నభర్తృపరిహీన మెంతసొంపుగానున్నది? మనోదోషములు తొలఁగినఁగాని భగవదారాధనము సత్ఫలవంతము కాఁజాలదని తేలెడిని. మనస్సు ధనాశాబద్ధమై యీర్ష్యాదుర్గుణసాంద్రమై యుండఁగా యోగివేషముదాల్చిన కపటనాటకసూత్రధారులు చేయు భగవదారాధనము నిష్ఫలమగుటయేగాక దుష్ఫలదము కూడ నగుననుట కేమిసందియము. కావున మనోమలము లనఁబడు కామక్రోధాదులఁ బాఱఁదోలి యథాశక్తి న్యాయము ననుసరించి పరమేశ్వరుని భక్తిమెయి నారాధించిన నామహాత్ముఁ డనుగ్రహించి యక్షయానందసుఖము నొసంగును.

భగవంతుఁడు సర్వశక్తియుతుఁడు. బీజాంకురన్యాయము ననుసరించి యున్నవస్తువులు తద్వశమునందుండు. కాని యాస్థితి యం దాపరమాత్మ యేకార్యము నాచరింపఁడు. ప్రకృతివిశిష్టుఁ డైననే ప్రపంచవిషయకచింతగలవాఁడగును. ఆస్థితియం దా మహానుభావుఁడు సగుణబ్రహ్మ మనంబడును. అనఁగాఁ బ్రకృతిని సర్వకార్యముల నాచరింప నియమించి తాను సర్వసాక్షియై యుండునని భావము. ప్రకృతి యొకస్త్రీగాదు. ప్రకృతిశబ్దము స్త్రీలింగము. ప్రకృతి భగవంతు నిచ్ఛాశక్తి. ఆప్రకృతి ఇచ్ఛాశక్తి యని, జ్ఞానశక్తి యని, క్రియాశక్తి యని పిలువంబడును. ఈమూఁడును భగవంతుని సంకల్పములే. ఉపాసకునియిచ్ఛ ననుసరించి స్త్రీరూపములఁ దాల్చును. భగవంతుఁడుకూడ నుపాసకునియిష్టము ననుసరించి రూపములు ధరించునుగదా. అనఁగా నేరూపమున నుపాసకుఁ డాపరమాత్మను ధ్యానవిషయునిగాఁ జేయునో యారూపమునఁ దోఁచి వానిని రక్షించును. అట్లే ప్రకృతియు నని యెఱుంగఁదగు. ప్రకృతి యని

యుపాసించినను ఆపరమాత్మ నుపాసించినట్లే యని భావము. ఆయిచ్ఛయు నామహానుభావునిదే కదా.

"ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా,
న తే రూపం న చాకారో నాయుధాని న చాస్పదం,
తథాపి పురుషాకారో భక్తానాం త్వం ప్రకాశసే."

అనుప్రాచీనసూక్తు లీయర్థమునే సమర్థించుచున్నవి. కావున భక్తానుగ్రహార్థ మీశ్వరుఁడు రూపమును ధరించుననుటయే సారము. ఇఁకఁ గథాభాగమున నీవిషయమును సమన్వయింతము.

భగవంతుఁడు రామచంద్రరూపమును, మూలప్రకృతి సీతారూపమును ధరించి జగదుపకారము చేయుచుండిరి. వారి కార్యము నిర్వహింపఁదగువారెల్ల భూలోకమునఁ బుట్టిరి. వారివారి కార్యముల నిర్వహింపఁబూనిరి. వారిమూలమున నాయాకార్యములు చేయించునది ప్రకృతియే. శ్రీరామమూర్తి యీ ప్రకృతికార్యములను బరికించుచు సర్వసాక్షిగా నిర్లిప్తుఁడై యుండును. కాని తానుగూడ సర్వకార్యముల నిర్వహించుచున్నట్లు నటించును. ఎవ్వరెవ్వరేయే కార్యముల మూలమునఁ గీర్త్యపకీర్తుల నొందవలయునో వారు వారి కార్యముల నించుకంతయుఁ బ్రమాదపడక యొనరించునట్లు చేయవలయునని ప్రకృతి సంకల్పించును. కార్య మట్లే సాగును.

"సత్యం విధాతుం నిజభృత్యభాషితం
వ్యాప్తిం చ భూతే ష్వఖిలేషు చాత్మనః,
అదృశ్యతాత్యద్భుతరూప ముద్వహ
న్స్తంభే సభాయాం న మృగం న మానుషమ్." ౧౮

(శ్రీభాగ. ౭ స్కం. ౮ అధ్యా.)

అనువచనము.

"జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వన్నేత త్స్వమపి వపు రీశ స్తిరయతి,
సదా పూర్వస్సర్వం తదిద మనుగృహ్ణాతిచ శివ
స్తవాజ్ఞామాలంబ్యక్షణచలితయో ర్భ్రూలతికయోః." ౨౪

(సౌందర్యలహరి.)

అనువచనము పై వ్రాసినభావమును స్పష్టీకరించు చున్నవి.

ప్రస్తుతము సీతారాములు ధర్మరక్షణమునకుం బూనిరి. మంథరయుఁ గైకయు నాకార్యము సాగింపఁ బ్రధానకార్య మునంజను వనగమనమునకుఁ దోడ్పడిరి. దశరథునిదీనాలాపములు కైకేయికి రుచింపనయ్యెను. ఎంతప్రార్థించిన నామె తన పట్టు వదలదయ్యెను. ఏల? సీతాదేవి సంకల్పరూపశక్తి కైకేయి హృదయము నావేశించినది. ఆమెయుఁ గలశక్తి యడంగినది. పతివచనము దుర్లంఘ్యమన్న భావముగలసాధ్వియే కైకయగును. ఐనను బరదేవతాసంకల్ప మామెను సమర్పించినది. పతివచనము గ్రాహ్యమా? ధర్మరక్షణప్రయత్నము ముఖ్యమా? అని మనము విచారింపవలయును. సామాన్యదృష్టికిఁ బతివాక్యము రీతి మెలఁగుటయే ధర్మమని తోఁచును. ఇదియే సిద్ధాంతమైన యెడలఁ గర్హ్యసిద్ధాంతమునకుఁ విలోమకప్రదానము కావలసి వచ్చును. ఎట్లనఁగాఁ జిత్తగింపుఁడు. దశరథుఁడు శాపకారణమునఁ బుత్రవియోగదుఃఖమున మృతినొంద సిద్ధుఁడై యున్నవాఁడు. విరాధాదిరాక్షసులు రామునిచేఁ జావ నాయత్తులై యున్నవారు. ఈకర్మఫలముల కన్నింటికిఁ గైక పట్టుదలయే

ప్రధానము. దశరథునిభార్యల కంటను పుత్రభాగ్యదాయకమగు కాలము సమీపించియున్నది. గుహుఁడను బోయనగుభక్తునకు శ్రీరామదర్శనమహాభాగ్యము లభించుకాలము వచ్చియున్నది. ఇన్నికర్మములు ఫలించనుండఁగాఁ గైక యిట్లు పతివచనము నంగీకరించును? అంగీకరించు నవకాశముకలదా? ఆమెయుఁ గర్మపాశబద్ధురాలేకదా. కర్మసిద్ధాంతము బలవత్తరమని భగవంతుఁడే "గహనాకర్మణోగతిః" అన్నవాక్యముచేతఁ దెలిపియే యున్నాఁడు. కాఁబట్టి కైక పతివ్రతాశిరోమణియే యగును. దశరథుఁడు సత్యవాదియే యగును. కాని కర్మము త్రిప్పలను లోనుకానివాఁ డెవ్వఁడు ప్రపంచములయం దెన్నఁడైనఁ గలఁడా? ఇట్లుండఁ గైకేయిని మంథరను దూషించుట కర్మసిద్ధాంతము నకు విరుద్ధముకాదా. కావున దైవకార్యమునకుఁ దోడ్పడి లోకములకు మహోపకార మొనరించిరని వారిని మనము భావింప వలయు. మఱిమఱి సంభావింపవలయును. దానిచేఁ గర్మగతి యిట్టిదని యెఱుంగనగును. దాన నహంకారము నశించును. అయ్యది భక్తికిఁ ద్రోవచూపు. అదియే భగవత్కృపకుఁ బాత్రులనుగా మనల నొనరించును. ఈవిషయమును బలు సారులు మననముచేయుచుండినచో మనోమలము లనంబడు కామక్రోధాదులు తొలఁగును. పిదప

"మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః."

అన్నసూక్తి స్వానుభవరూపసత్ఫలము నొసంగును. ఇఁక శ్రీ రామచంద్రుఁడు ప్రకృతియు నెట్లు ప్రవర్తించి ధర్మరక్షణము చేసి. రనువిషయమును బరికింతము.

## శ్రీరాముఁడు తల్లికిఁ దనయరణ్య గమనముఁ దెల్పుట.

* శ్రీరామమూర్తి తల్లిదండ్రులకు నమస్కరించి తన వనగమనాంగీకారమును దెలిపి యంతఃపురమునుండి వెలుపలికి రాఁగా నంతఃపురంధ్రులు లొక్కపెట్టు రోదనముగావించిరి. వారెల్ల విలపించుచు శ్రీరాముఁడు తండ్రి యాజ్ఞాపింపక యున్నను మనకెల్ల సేయు కార్యములు కావలయునో వానినెల్లఁ దానే యొనరించి రక్షించువాఁడు. అట్టి మహనీయమూర్తి యయోధ్యనవిలి యడవుల కరుగుచున్నాఁడుకదా. తల్లి కౌసల్య కెట్లు సేవలు చేయుచుండునో యట్లే మనకెల్ల శుశ్రూషలు చేయుచుండును. ఇతఁడు తిట్టుపరుషమాటలు పల్కనను రాముఁడు క్రోధమూనఁడు. ఒరులకుఁ గోపము గల్గించు పనుల నొనరింపఁడు. కోపక్రోధావిష్టులను సంతోషయుక్తులనుగాఁ జేయును. అక్కటా! ప్రభువునకు బుద్ధి గాలుమాసినది. కనుకనే సకలభూతరక్షకుఁడగు శ్రీరాముని నడవులకుఁ బంపి భూతకోటిఁ బొలియించుచున్నాఁడు. అని యొండొరులతోఁ జెప్పికొనుచు రాజును దూఱుచు వత్సములఁ బాసిన ధేనువులం బోలి విలపించిరి. పుత్రవిరహదుఃఖమున మగ్నుఁడగుచున్న రాజు నంతఃపురకాంతలయేడ్పు వినఁబడఁగా ద్విగుణమగు శోకమున నత్తే శయ్యపైఁ బడియెను. రామచంద్రుఁడును వారివిలాపధ్వనుల నాలకించి సంకటపడుచు జితేంద్రియుఁడు కాన దుఃఖముఁ జిక్కఁబట్టి లక్ష్మణునితోఁ దల్లికడకుం బోయెను. రాజా [illegible] గావింప

* అయోధ్యకాండమున నిరువదియవసర్గమున నీకథ గలదు. అధ్యాత్మ రామాయణకథయు నిం దంతర్భూతముగనుండు.

నున్నవృద్ధుఁడు ద్వారపాలాధిపతి యెదురుగాఁ గాంచెను. అందుఁగలవారెల్లరు లేచి నిలువంబడి జయజయశబ్దపూర్వకమున నాశీర్వదించిరి.

శ్రీరామమూర్తి తొలుతటికక్ష్యఁ బ్రవేశించి యవ్వల రెండవకక్ష్యనొంది వేదవిదులగు వృద్ధబ్రాహ్మణులం గాంచెను. వారికి నమస్కరించి యవ్వలికక్ష్యం బ్రవేశించి యచ్చటఁ గావలి యుండుముదుసలిస్త్రీలను బాలికలను బిలకరించెను. వారెల్లరు నానందమున నాశీర్వదించి లోపలి కరిగి రామచంద్రాగమనమును కౌసల్య కెఱిఁగించిరి. ఆమె రాత్రియంతయు నియమమున జాగరణమొనరించి యారోజుననే పుత్రునకు మేలు గోరి విష్ణుమూర్తి నారాధించెను. ఆమె [illegible]రాలు. శ్వేతవర్ణముగల కౌశేయమును దాల్చి శుభ్రాలంకారములు గలదియై హోమమును విప్రులవలనఁ జేయించుచుండెను. ఆసమయముననే శ్రీరాముఁ డంతఃపురముం బ్రవేశించి తల్లిని వీక్షించెను. అందుఁగల దేవపూజోపకరణములం గాంచెను. దధి అక్షతలు లోనగుమంగళద్రవ్యములు రామమూర్తికి గోచరించెను. భగవత్పూజానిరతిగలిగి దేవతవలెఁ బ్రకాశించుతల్లిని వీక్షించెను. ధ్యాననిరతియున్న యాకౌసల్య కొంతసేపూరకుండి స్మృతి రాఁగాఁ దనగారాబుకొడుకు రాకం గాంచి యుప్పొంగి యెదురేగెను. రామమూర్తి నమస్కరింపఁ గౌఁగిలించుకొని శిరము మూర్కొనియె. ఆమె వాత్సల్యము వర్ణనాతీతమున నిట్లనెను. రామచంద్రా! మహాధార్మికులు వృద్ధులు నగు రాజర్షులవలె నీవు పూర్ణాయుష్యమును విశాలకీర్తిని గుణోచితధర్మమును బొందుము. నీతండ్రి చెప్పినమాట తప్పువాఁడు కాఁడు. కాన నింక నభిషేకమునకుఁ బ్రయత్నింపలేదే యని సంశయము

వలదు. నిన్నిపుడె యభిషేకించుంజూమీ యని హితముగాఁ బలికెను.

తల్లి భోజనార్థము పిలిచి పీఠముచూపఁగా నితరు లాసంగునాసనమునఁ గూచుండకయున్న హస్తమునన్నే నఁ దాఁకవలయు నన్న నియమము ననుసరించి దానిని స్పృశించి యాదరణమునఁ బలుకుచున్న తల్లికి నడవికిఁబోవుదునని యేరీతిఁ దెలుపుదునా యని లజ్జించి యంజలిబంధించి మిక్కిలి వినయ ముతోఁ దనపయనమున కనుజ్ఞ వేఁడఁబూని యిట్లు పలికెను. తల్లీ! ఇప్పటికి మహాభయ మొక్కఁడు నిశ్చయముగా రాను న్నది. అది నీకు దెలియకపడలేదు. ఈమాట సీతాలక్ష్మణులకు నీకును దుఃఖమును గల్గించును. అయినఁ జెప్పక మాననయిత్తి గాదు. నేను దండకారణ్యమునకుం బోవుచున్నవాఁడనుగదా. అట్టె నాకీనాఁటిమునుగుపీఠ మేల? దర్భాసనముపైఁ గూరు చుండఁదగినకాల మిపుడు వచ్చుచున్నది. తేనె, మూలములు, ఫలములు భక్షించుచు వంటలవాఁడు సిద్ధము చేసిన మధ్యమాంస మును వదలి నిర్మానుష్యమగు మహారణ్యమునఁ బదునాలుగు సంవత్సరములు కాపురము చేయఁబోవుచున్నాఁడను. రాజేం ద్రుఁడు భరతునకు రాజ్యమొసంగెను. నన్ను మాత్రము ముని వలె దండకారణ్యమునకుఁ బోవునట్లు కట్టడ చేసినాఁడు. తల్లీ! నేను దండకారణ్యమునకుఁ దండ్రియానతిచొప్పున వానప్రస్థ కర్మముల నాచరించుచు ఫలమూలములఁ దినుచుఁ గాలముఁ ద్రోయుచు నాలు [illegible] నగు సంవత్సరములు నివసించి యుందును.

అని రాముఁడు పలుకఁగా విని యారాణి భరింపరాని శోకము ప్రజ్వరిల్లఁగాఁ గానఁ బరశుధారాహతం దెగిపడిన

లగుకర్మములను వదలును. కోపవంతులను ప్రసన్నులనుగాఁ జేయును.

భగవద్దర్శనమున నింద్రియకర్మములు మాఱువలయును గదా. అట్టిదియే భగవద్రూపము. అనఁగాఁ బరిపక్వాంతఃకరణులే యారూపమును గాంచఁగలరు. దాన దుర్వాసనలు నశించును. మనస్సు నిర్మలమగును. భగవత్తేజస్సు భక్తమనస్సు నలముకొనును. అకారణమున నందుఁగల క్రోధాదులు మార్పు నొందును. సద్వాసనలు పెంపొందును.

"మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శితమాత్మయోగాత్,
తేజోమయం విశ్వమనంతమాద్యం యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్."
(గీ. అధ్యా. ౧౧)

అనుగీతావాక్యమును బరికించిన నీయర్థము తేటపడును. సామాన్యముగా రాజతేజ మెల్లరను భయపెట్టునది.

"యస్మాదేషాం సురేంద్రాణాం మాత్రాభ్యో నిర్మితో నృపః,
తస్మాదభిభవత్యేష సర్వభూతాని తేజసా." (మ. మను. ౭ అధ్యా.)

భగవత్తేజ మట్టిది కాదు. సర్వభూతములను దర్శనమాత్రమున మార్చివేయునది. మహాత్ముల తేజముకూడ నట్టిదే యగునుగదా. కణ్వాదిమునులు తమతేజోబలమున సహజవైరముగలజంతువుల మనోవృత్తులను మార్చి సహజసౌహార్దములనుగా నొనరించినట్లు పురాణాదులు తెలుపుచుండఁగా విందుముగదా. అట్టికృత్యము నొనర్చునది యేది? నిర్మలమగువారిసమహాత్త్వమున నలవడినభగవత్తేజోలవమే కాక మఱేది? ఎవ్వారిమనస్సున నీర్ష్యాదిదుర్గుణములు లేవో వారియందే భగవత్తేజ మావ

చేయరాదని మనము గ్రహింపవలయును. కులధర్మములు విడువ రాదనియు మన మెఱుంగవలయును.

"ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః,
తస్మాద్ధర్మో న హంతవ్యో మానో ధర్మో హతోఽవధీత్. ౧౫
వృషో హి భగవాన్ ధర్మస్తస్య యః కురుతే హ్యలం,
వృషలం తం విదుర్దేవాస్తస్మాద్ధర్మం న లోపయేత్." ౧౬. అధ్యా. ౮

అని మనుస్మృతి బోధించెడిని. కావునఁ గులధర్మములు విడువరా యనుష్ఠేయములే. కాని ధర్మానుష్ఠానము ఫలము గోరి చేయ రాదు. భగవత్స్వరూపమని తదారాధనమునఁ బరమేశ్వరుఁడు తృప్తుఁడగుననియుఁ జేయఁదగినది.

"సత్యప్రతిజ్ఞం పితరం రాజానం పశ్య రాఘవ,
అద్యైవ హి త్వాం ధర్మాత్మా యౌవరాజ్యేఽభిషేక్ష్యతి." ౫౬

అని మూలము. దశరథుఁడు సత్యప్రతిజ్ఞుఁడే యగునని తెలుఁగు మనుట ప్రతీతికార్థము. దశరథుఁ డాడితప్పనివాఁడన్న కౌసల్య వాక్యము సార్థకము. పూర్వాపరవాగ్దానములలో దేనిని సరించినను సత్యవాదియే కదా. కైక కొసంగిన వరమును చెల్లించుటం జేసి యసత్యప్రతిజ్ఞుఁడు కాఁజాలఁడు. ఆవదాన మెఱుంగనివా రట్లూహింపఁజాలరి. మహాకవి వాల్మీకి దశరథుని ప్రవర్తన మెట్టిదని లోకులకుఁ దెలియవలయుననియే కౌసల్యనోట సత్యవాదియే యని పలికించెను. ఆతఁ డెన్నఁడు నాడితప్పనివాఁ డనుభావము నీవాక్యమే తెలుపును. జనులను పాలించు రాజు సత్యపాలకుఁడుగా నుండవలయునను నీతి నీవాక్యము తెలుపుచున్నది. సత్యము నారాధించినఁగాని ప్రజారంజనకార్యమునఁ

గృహస్థుఁడు కాఁజాలఁడని మన మెఱుంగవలయును. సత్య పాలన మొకతపస్సనియు నెఱుంగందగు.

"ఋతం తపస్సత్యం తపశ్శ్రుతం తపశ్శాంతం తపో దమ స్తపశ్శమ స్తపో దానం తపో యజ్ఞం తపో భూర్భువస్సువర్బ్రహ్మైతదుపాస్యైత త్తపః."

—ఆరణ్యకము.

అని శ్రుతి బోధించుచున్నది. సత్యము ననుసరించువారు మును లనఁదగుదురు. ఈశ్రుతిలోఁ దెలిపినవన్నియుఁ దపశ్శబ్దవాచ్య ములే. దేని నారాధించినను భగవంతుఁడు తృప్తుఁడగునని సారము.

"ద త్తమాసనమాలభ్య భోజనేన నిమంత్రితః,
మాతరం రాఘవః కించిద్వ్రీడాత్ప్రాంజలిరబ్రవీత్." ౨౫

అని మూలము. తల్లి రామచంద్రుని భుజింపఁ బంచి యాసన మిప్పించెను. రామమూర్తి భుజింపక యాపీఠమును గరమున స్పృశించెను. పరమాదరమునఁ బిలిచి యన్నము పెట్టి యాసన మీయఁగా భుజింప నలసుపడక యున్నను వారిచ్చినపీఠమును దాఁకవలయును. దాన నాగృహస్థున్ను తృప్తుండగునన్న సదా చారమును శ్రీరామమూర్తి మనకుఁ దెలిపెనని యెఱుంగవల యును. సదాచారములన్నియు రామచంద్ర ప్రవర్తనమునుండి మనము గ్రహింపవచ్చును. ఆదరించినవారిని గౌరవింపవలయును గాని తిరస్కరింపరాదనునదియే యిందుఁగలసారము.

"దేవి నూనం న జానీషే మహద్భయముపస్థితం,
ఇదం చ తవ దుఃఖాయ వైదేహ్యా లక్ష్మణస్య చ." ౨౬

అనునది శ్రీగోవిందరాజీయము సామాన్యార్థము స్పష్టము. రామ మూర్తి సర్వజ్ఞత్వము దీనిమూలమున వెల్లడించెను. ఎట్లు?

పరహింసారూపదుష్కార్యమునఁ బ్రవర్తించినందున వారిశ
శ్శక్తి ఫలవంతము కానయ్యెను. ఎట్టిసత్కార్యములైనను
హింసాకర్మపరములయ్యెనేని సత్ఫలము నీయఁజాలవనుట సిద్ధాం
తము. కనుక నట్టిదుష్టకార్యరతుల వధింపఁబూనిన రామమూర్తి
తదనురూపశక్తిమంతుఁడు కావలయును. కాఁబట్టియే ముని
వృత్తి నుండవలయునని కైకను బ్రోత్సహించి యామెచేఁ
జెప్పించి యామాటరీతిగాఁ దాను వర్తించినట్లు సమర్థించెను.
శ్రీరామమూర్తి పరమేశ్వరుఁడౌట సర్వసంపూర్ణుఁడగు
శక్తిసంపన్నుఁడు కాఁజాలఁడా. మరలఁ దపస్సంపాదనమున
కేల ప్రయత్నింపవలయును? అను ప్రశ్నము [illegible].

"యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః"

అన్నగీతాప్రమాణము ననుసరించి లోకులకు సదాచారమును
నేర్పుటకే యవతరించినందునఁ దాను బ్రహ్మచర్యము [illegible]
బోధింపవలయునుగాని వాగ్రూపమునఁ దెలుపఁగూడదు. కాఁ
బట్టియే దర్భాసనమును గూరుచుండఁదగిన కాలమునందును
గాని మణిమయాసనమునఁ గూరుచుండఁదగినది కాదని తెలి
పెను.

"విష్టరాసనయోగ్యో హి"

అన్నమూలమునకు,

"విష్టరో నామ పంచవింశతి దర్భనిర్మితో తాపసాసనవిశేషః, పంచాశద్భి
ర్భవేద్బ్రహ్మా తదర్ధేన తు విష్టరః ఇతి స్మృతేః."

అని గోవిందరాజులు,

"విష్టరాసనం నామ అవిచ్ఛిన్నాగ్రపంచవింశతిదర్భనిర్మితాసన మిత్యర్థః"

అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి.

"విష్టరస్తు సార్ధద్వితయవామావర్తవలితాగ్రోర్ధ్వముఖాగ్రా అసంఖ్యాతదర్భాః.
తథా చ గృహ్యసంగ్రహః.—

"ఊర్ధ్వకేశో భవేద్బ్రహ్మా లంబకేశస్తు విష్టరః." ఇతి.
ఛందోగపరిశిష్టమ్.

"దర్భసంఖ్యా న విహితా విష్టరాస్తరణేష్వపి,
ఏపంచ.

పంచాశద్భిర్భవేద్బ్రహ్మా తదర్ధేన తు విష్టరః." ఇతి.

"యది సమూలం తదాశాఖ్యంతరీయం, ఏతేన విష్టరే పంచవింశతి సంఖ్యా, భవదేవభట్టోక్తా నిరస్తా. ఏవం విష్టరగ్రహణం హస్తాభ్యామపి యదుక్తం తదపి నిరస్తం.

"యత్రోపదిశ్యతే కర్మ కర్తురంగం న చోచ్యతే,
దక్షిణస్తత్ర విజ్ఞేయః కర్మణాం పారగః కరః."
ఇతి ఛందోగపరిశిష్టం ఇతి సంస్కారతత్వమ్."

అని శబ్దకల్పద్రుమము.

ఇరువదియైదు దర్భలచే నిర్మింపఁబడినది విష్టరమనుట నియమము కాదని సారము. తపోనిరతిసుండి భగవదనుగ్రహపాత్రుఁడైనఁగాని మనశ్శక్తిగలవాఁడు కాఁడనువిషయము ఈభాగమునుండి మనము గ్రహింపవలయును. భగవద్ధ్యానమునఁగాని యేగొప్పకార్యము సాధింపఁజాలననునూహ యెప్పుడు గలుగునో యప్పుడే యహంకారము తొలఁగునని భావము. అప్పుడే మనస్సు నిర్మలముగా నుండఁగలదనియే తాత్పర్యము.

నాలుగుపదుఁను నగుసంవత్సరములు దండకారణ్యవాసమని శ్రీరామచంద్రుఁడు తెలిపెను. దీనఁగలవిశేషమేమి? ఉపాస

కుఁడు ఇష్టదేవత నారాధించుచుండినఁ దదనుగ్రహము పండ్రెండుసంవత్సరములకుఁ గలుగుననియు సాక్షాత్కారము కలుగ వచ్చును. కాని పండ్రెండుసంవత్సరము లుపాసించుటకు మహా నియమమని పెద్దలభావము. దీనికే మహావ్రతమనియు నామాంతరము గలదు. తదుపరి రెండుసంవత్సరములు తపస్సునకు దుష్టసంహారమునకును నెలుంగవలెను "విజనే వనే" అనునవి యీతపోనియమమును దెలుపుచున్నవి. ఏకాంతసాధన యోగి సమ్మతమనుట ప్రసిద్ధమే కదా.

తేనె కందమూలఫలములు నాహారముగా మునివలె నుండును. వంటవాండ్రు పెక్కుభంగుల సంస్కరించిన మాంస విశేషమును వదలుకొనును. అని రామమూర్తి పలికెను. దీనిభావ మేమి?

"ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః,
రస్యాస్స్నిగ్ధాస్స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః." ౮

గీత ౧౭. అధ్యా.

అన్న భగవదుక్తి ననుసరించి సత్త్వగుణమును వృద్ధిచేయునాహారము మునులయాహారమని ప్రసిద్ధము. కావున నట్టియాహారమునే భుజించువాఁడనని రామునాశయము. ఆమిష శబ్దమునకు వంట వాండ్రు పెక్కుభంగుల వండినమాంసమనియే యర్థమని వ్యాఖ్యాతలు వ్రాసిరి.

"ఇదం మేధ్యమిదం స్వాదు నిష్టప్తమిదమగ్నినా,"

అని సూక్తి. ముందీరామాయణమునందే కేవలమాంసగ్రహణము చెప్పఁబడును. కావుననే యీయర్థము సుసంగతమే. "మధుమూలఫలైః" అనుమూలమునఁ గలమధుశబ్దమునకు

మద్యముగూడ నర్థమని కొందఱందురు. 'మధు మద్యే పుష్పరసే' అని యున్నదికదా. మద్యము గ్రహింపననునర్థము పలుకరాదని కొందఱాక్షేపింతురు. క్షత్రియాదులకు కొన్నిమద్యములు పానార్హములే యగును.

“న మాంసం రాఘవో భుంక్తే న చాపి మధు సేవతే.” ౪౧.

సుందరకాం. ౩౬-సర్గము.

అని హనుమంతుఁడు సీతాదేవికిం దెల్పెను. ఇందు మద్యమే మధుశబ్దార్థముగాని తేనె కాదు.

“పైష్టికం తాళజం కైరం మాధూకం గుడసంభవమ్.
తృతీయాది త్రివర్ణానామాసవం పేయముచ్యతే,
స్త్రీణామపి తృతీయాది పేయం స్యాద్బ్రాహ్మణీం వినా.
అథ భర్తృప్రసన్నార్థం నారీ మద్యం పిబతి లోలుపా,
ఉన్మాదినీతి సా ఖ్యాతా తాం త్యజేదంత్యజామివ.” బ్రహ్మాండపురాణము.

అని ప్రమాణము కలదు. దీనింబట్టి నాఁడుఁగా సీతావియోగానంతరము మద్యమాంసములను వర్జించెననియు, నంతకుముందు విధివిహితములగు మద్యమాంసములఁ బరిగ్రహించువాఁడనియుఁ దేలెడిని. మధుశబ్దమునకు మద్యమిట నర్థము కాదను వాదము సాధువా కాదా యని పండితు లూహింతురుగాక. మద్యపానము చేయువారికి మనఃప్రసన్నత్వ మలవడునా. అట్టివారిచ్చుపూజను బరమేశ్వరుఁడు గ్రహించునా యని ప్రశ్నించువారు కలరు. కాని,

“యదన్నం పురుషో భుఙ్క్తే తదన్నం తస్య దేవతాః.”

అన్నసూక్తిని బాగెఱుంగరు. కులోచితాచారము భగవంతుని మెప్పించుటయే కాని వేఱు కాదు. విధివిధించిన యాహారము దుష్టము కానేరదు. కనుకనే

"బ్రాహ్మణో మదిరాం దత్త్వా బ్రాహ్మణ్యాదేవ హీయతే."

అన్న కాళీవాక్యము సుసంగతము కావున మద్యమాంసములు నివేదనాదిక కులదైవతముల నారాధించుచుఁ గుహ్యకృత్యముల ననుసరించువారు భక్తిగలవారైననో భగవదనుగ్రహమునకుఁ బాత్రులేల కారో తెలియరాకున్నది. ఋష్యాదులనే తెలిసికొని వారిభావ మరయుదము.

"చతుర్దశ హి వర్షాణి వత్స్యామి విజనే వనే,
మధుమూలఫలైర్జీవన్ హిత్వా మునివదామిషమ్."

అని మూలము.

"అత్ర ఆమిషశబ్దేన సూదైస్సంస్కృతం మాంసముచ్యతే, కేవలం మాంస స్వీకారస్యోత్తరత్ర వక్ష్యమాణత్వాత్."

అని గోవిందరాజవ్యాఖ్య.

"ఆమిషశబ్దేన సూదైస్సంస్కృతం మాంసభక్ష్యభోజ్యాదికం ఉచ్యతే. 'ఇదం మేధ్యమిదం స్వాదు నిష్టప్తమిదమగ్నినా' ఇతి ఉత్తరత్ర కేవలమాంసస్వీకారస్య వక్ష్యమాణత్వాత్."

అని మహేశ్వరతీర్థులు.

క. "మునివలె విజనంబగున
వ్వనమున నివసింపఁబోవువాఁడను మాంసం
బును వంటవాండ్రు పచనం
బును జేసినదానిఁ దినఁగఁ బోలదు సుమ్మీ."

(ఆంధ్ర శ్రీమద్రామాయణము.)

"పాటిలె మౌనిరీతి మధుపక్వఫలంబుల నుక్కి- మాంసము
న్నాట దలంపకుండుఁ బదునాలుగువర్షము లేఁ దపస్వినై."

(వావిలికొలను రామాయణము.)

అనిమిషశబ్దమునకుఁ బెద్దలు సిద్ధాంతము చేసినది వ్రాయుట మేలో, మానుట మేలో పెద్దలు నిర్ణయింపఁగలరు. విమర్శకులు పక్షపాతమునఁ బొగడినందునను, నాపద్యములఁ దెగడినందున నీవిషయము వ్రాయవలసివచ్చెను. వేఱుకారణమునఁ గాదని పాఠకమహాశయు లూహింతురుగాక.

"సా బహూన్యమనోజ్ఞాని వాక్యాని హృదయచ్ఛిదాం,
అహం శ్రోష్యే సపత్నీనామవరాణాం వరా సతీ." ౩౯

అని మూలము. రామచంద్రునకుం గౌసల్య తెలుపుమాట లివి. ఇది కేవలము స్త్రీస్వభావమును బోధించెడిని. ఎల్లరయందెక్కువదాననయ్యు ననఁగాఁ దొలిభార్యనయ్యుఁ దక్కువవారగు సపత్నులాడు కఠోరవాక్కుల వినుట విశేషదుఃఖకరమని తల్లి కొడుకునకుం దెల్పెను. తొలిభార్య కొడుకునకు రాజ్యము లభింపుటయే కదా పెద్దభార్యయందుఁ గలశ్రేష్ఠత్వము. ఎంతశాంతముగలవారైనను స్త్రీలుమాత్రము సపత్నులతోఁ గలిసియుండరను దానిని మన మెఱుంగవలయును.

"దశ సప్త చ వర్షాణి తవ జాతస్య రాఘవ,
అసితాని ప్రకాంక్షంత్యా మయా దుఃఖపరిక్షయం." ౪౫

అని మూలము కౌసల్య రామునకుఁ దెల్పెనని సంగతార్థము. ఇందు రాముని వయోనిర్ణయము చేయు నవకాశము కలదు. వాల్మీకిరామాయణమున సంశయము నీవిషయము కలదు. ఒక్కదానికి నొకటికి విరుద్ధముగ నుండును. కావునఁ గొందఱు వాల్మీకిరామాయణమున ననేకు లనేకభాగములు చేర్చినారనియెదరు. గమనించిన యిట్టిపూర్వాపరవిరుద్ధములు గలవనియుఁ జెప్పుదురు కొందఱు. పనిలేనిమంగలి పిల్లితలఁ గొరిగెనన్నట్లు

పరిశీలకుల మనుపేర నాక్షేపించువారనియే వారినిగూర్చి మనము చింతింపవలయును. విరుద్ధములగు నీవిషయముల సమర్థించుటెట్లు? వినుఁడు.

ఆర్షగ్రంథములన్నియు మతసిద్ధాంతములకు నాధారపడియుండును. నాలుగుజాతులుగా విభజించినవారిలో ముదటి మూఁడుజాతులవారికి ద్విజులని పేరు.

"వైదికైః కర్మభిః పుణ్యైర్నిషేకాది ద్విజన్మనాం,
కార్యశ్శరీరసంస్కారః పావనః ప్రేత్య చేహ చ. ౨౬
గార్భైర్హోమైర్జాతకర్మచౌడమౌంజీనిబంధనైః,
బైజికం గార్భికం చైనో ద్విజానామపమృజ్యతే. ౨౭
స్వాధ్యాయేన వ్రతైర్హోమైస్త్రైవిద్యేనేజ్యయా సుతైః
మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః." ౨౮

మను. ౨ అధ్యా.

"మాతుర్యదగ్రే జాయంతే ద్వితీయం మౌంజిబంధనాత్,
బ్రాహ్మణక్షత్రియవిశస్తస్మాదేతే ద్విజాస్స్మృతాః. ౩౯
యజ్ఞానాం తపసాం చైవ శుభానాం చైవ కర్మణాం,
వేదఏవ ద్విజాతీనాం నిశ్శ్రేయసకరః పరః." ౪౦

యాజ్ఞవల్క్యస్మృతి. ఆచారకాండము.

"సంక్రాంతౌ విషువే చైవ స్వజన్మత్రితయేఽయనే,"

అని శాతాతపప్రశ్నోత్తరము.

స్వజన్మత్రితయ మనఁగా జననము, ఉపనయనము, దీక్షాస్వీకారము అనునవి మూఁడును స్వజన్మత్రితయ మనంబడును.

ద్విజులనఁగా సాధారణముగా రెండుజన్మములుగల వారనియే యర్థము. జననము, ఉపనయనము అనునవియే

రెండుజన్మములు. జనన మెల్లరకు సమానజన్మము. ఉపనయనము విశేషించి బ్రహ్మక్షత్రియవైశ్యులకు జననదినము. ప్రాయశః పెద్దలుపనయనాదిగా వయస్సు లెక్కింతురు. కొందఱు జననాదిగా లెక్కింతురు. ఈ రెండువిషయములు మనస్సున నునుపకొనిన శంకలు గలుగునవకాశము లేదు. విరుద్ధవిషయము లేవనఁగా:—

దశ సప్త చ వర్షాణి = కౌసల్య (పదునేడేండ్లు)
ఊనషోడశవర్షో మే = దశరథుఁడు (పదాఱేండ్లు నిండలేదు.)
ఉషిత్వా ద్వాదశ సమా ఇక్ష్వాకూణాం నివేశనే = సీతాదేవి.
(అయోధ్యలోఁ బండ్రెండు వత్సరము లుంటిని.)

"మమ భర్తా మహాతేజా వయసా పంచవింశకః,
అష్టాదశ హి వర్షాణి మమ జన్మ నిగణ్యతే." సీతాదేవి.
(రామునికి నిరువదియైదు వత్సరములు. నాకుఁ బదునెనిమిది.)

దశరథమహారాజు విశ్వామిత్రునితో నాకొడుకునకు నింకను బదాఱువత్సరములైన నిండలేదే అనియెను. ఆసంవత్సరముననే సీతాకళ్యాణము సాగెను. సీత యయోధ్యయందుఁ బండ్రెండు వత్సరము లుంటినన్నందునఁ బదునాఱు పండ్రెండు కలిపిన నిరువదెనిమిదిసంవత్సరములగును. అడవికిఁ బోవునప్పటికి రాముని వయస్సు ఇరువదియైదువత్సరములు నాకుఁ బదునెనిమిదేండ్లు. అని సీతయే పలికెను. కౌసల్య పదునేడువర్షము లనియెను. ఈ మూఁడును నొకదానికొకటి సరిపడవు. ఇవి సరిపడువిధము కౌసల్య ఉపనయనమునుండి వయస్సుపరిగణించెనని యూహింపఁదగు. కామ్యబద్ధములని చెప్పఁబడిన యుపనయనకాలమునందు నెనిమిదవయేట నుపనయనము సాగినదనుకొందగు. కౌసల్యచెప్పిన పదియేడేండ్లు ఈరీతిగా నంగీకరింపవలయును.

ఆవయస్సున వివాహము సంగతమాయన్న దృఢశరీరులకు సంగతమే యని కొందఱు వ్రాసిరి. అయ్యది యపహాస్యభాజనముగాఁ దోఁచును. ఇఁక సమాధాన మేలాగు? అన్న ప్రశ్నము చక్కనిది. సీత యయోనిజాత యనునది యంగీకరించువారల కిది యచ్చెరువు కలిగింపదు. రామమూర్తికన్న వయసున సీత పెద్దదిగానే తోఁచును. సీతారాములు ప్రకృతిపూరుషులుగాన నీవయఃపరిమాణము వారికిం జెల్లదు. సీత తనవయస్సు పదునెనిమిదియనుట లోకులకు విశ్వాసార్థమే కాని వేఱుగాదు. పదునెనిమిదియేండ్లనారీమణిగా నెల్లరకు దర్శనమిచ్చెను. శ్రీరామమూర్తి కౌసల్యాగర్భసంభూతుఁడుగాన నాశ్రీరాముని వయస్సు సరిగనే యున్నది.

“అనన్యపూర్వికాం కాంతామసపిండాం యవీయసీమ్.” యాజ్ఞవల్క్యము.

“యవీయసీం వయసా ప్రమాణతశ్చ న్యూనామ్.”

ఈస్మృతివాక్యము ననుసరించి వరునివయస్సుకంటెఁ గన్యకవయస్సు తక్కువగా నుండవలయుననుట స్పష్టము. దానిననుసరించి సీతారాములవివాహమే శాస్త్రసమ్మతము కాదనవలయును. ఆదిమదంపతులగు సీతారాముల కీసామాన్యవిధుల ననున్వయము చేసి యాక్షేపింపరాదు. కావున, సీతారూపిణియగు మహాప్రకృతి రావణసంహారార్థము పదునెనిమిదేండ్లప్రాయముగలదిగాఁ గనఁబడియెననియు, సామాన్యశాస్త్రనియమము లాదిదంపతులవివాహవిషయమున నన్వయింపరాదనియు మనము నిర్ణయించుకొనవలయును. భగవచ్చరిత్రము చదువునపుడు దానిసారమేమనియే యూహింపవలయును. దాననే మనకు లాభము కలుగును. సామాన్యధర్మములు విశేషధర్మ

ములచే నడఁగఁద్రొక్కఁబడినదిగదా. ఈవచనమున కావచనము, ఆవచనమున కీవచనము విరుద్ధమనియు, గాన నొక్కఁడు చేసినకావ్యము కాదనియు వాదములు చేయుదురు, [illegible] పరమ పురుషార్థముగా భావించువారలు భగవత్తత్త్వము నెఱుంగఁ జాలరనుట సిద్ధాంతము. సీతారాముల ప్రవృత్తులు, వాని మహత్త్వము, వారు చేయునట్టి కార్యములు సర్వజనహితములగు టుత్తమము. రామాయణము ననుసరించి యాలోచించినను వయోనిర్ణయ మసంగతము కాదు. సీతఁగూడి రాముఁడు [illegible] విహరించె ననుటకు పూర్వ సమాధాన మేమనఁగా "స్వ[illegible]నం కేళిః" అను ప్రమాణము ననుసరించి వివాహానంతరము [illegible] కాలమున ననుభవించెననుటయే సమాధానము. అయోధ్య యందున్న పండ్రెండుసంవత్సరములలో రాముని వయస్సునకు సీతవయస్సునుఁ గలుపఁగాఁ బండ్రెండు దాఁటును. ఈరెండు వత్సరములు దాంపత్యసుఖానుభవకాలమని నిర్ణయింపవచ్చును. ఈసమాధానమున నసంగతమునకు నాధారము గానరాదు.

"అపశ్యంతీ తవ ముఖం పరిపూర్ణశశిప్రభం,
కృపణా వర్తయిష్యామి కథం కృపణజీవికాం." ౪౭

అని మూలము. కౌసల్యవాక్య మిది. సామాన్యార్థము స్పష్టము. సకలజగదాహ్లాదకరమగు భగవంతునిమోము చూడకయుండువాఁడు కృపణుఁడు. ఆతనిజీవనము దుఃఖజీవనము. శ్వేతవర్ణము ముక్తిప్రదము. శ్వేతవర్ణముగా భగవంతుని ధ్యానించువారు ముక్తికాములని యెఱుంగవలయు.

"ముక్తా ధ్యేయా శశిజ్యోత్స్నాచ్ఛ ధవళాకృతిరంబికా. ౭౧
రక్తసంధ్యకరోచిస్స్యాద్వశీకరణకర్మణి,

శవిత్వే విశదాకారా స్ఫటికోపలనిర్మలా. ౨౨
ధనలాభే సువర్ణాభా చింత్యతే లలితాంబికా,
సర్వసంపత్తిలాభే తు శ్యామలాంగీ విచింత్యతే. ౨౩
నీలా చ మూకీకరణే పీతా స్తంభనకర్మణి,
ఆమూలమాబ్రహ్మబిలం జ్వలన్మాణిక్యదీపవత్. ౨౪
యే ధ్యాయంతి మహఃపుంజం తే స్యుస్సంసిద్ధసిద్ధయః,
ఏవం బహుప్రకారేణ ధ్యానయోగేన కుంభజ. ౨౫
విభావయంత శ్రీదేవీం భజంతే మహతీం శ్రియం,
ప్రాప్యతే సద్భిరేవైషా నాసద్భిస్తు కదాచన." ౨౬

లలితోపాఖ్యానము. ౪౧-అధ్యా.

అను నీ ప్రమాణవాక్యములం బరిశీలించినచోఁ బై విషయము స్పష్టమగును. భగవంతుని దేజోరూపునిగా ధ్యానింపనివారి జీవనము దుఃఖజీవనమని భావము.

"యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి,
చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః,
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ."

అను నీభగవద్గీతావాక్యములు నీ భావమునే సూచించెడిని. కావున, శ్రీరామచంద్రుని శ్వేతవర్ణవిశిష్టునిగా ధ్యానించి మనఃకమలమునందు నెలకొల్పిన యా రూపమును జూచుచుండినచో నట్టిభక్తుని దే సుఖజీవనము. అనఁగా నాతనియానందమే నిజముగా నానంద మనంబడును. దీనిచేతఁ బూజ యనఁగా మానసికపూజయే యుత్తమమనియు, విగ్రహారాధన ముత్తమము కాదనియు, నయ్యది కేవలపామరులకొఱకు నిర్మింపఁబడిన దనియుఁ దేలెడిని.

"మ్రైవ నూనం మరణం న విద్యతే న చావకాశోఽస్తి యమక్షయే మమ,
యదంతకోఽద్యైవ న మాం జిహీర్షతి ప్రసహ్య సింహో రుదతీం మృగీమివ."

అని మూలము. ఇదియుఁ గౌసల్యపలుకువాక్యమే. మహాముని కౌసల్యనోట నొకరహస్యవిషయమును వెల్లడించెను. ఎట్లనఁగా భగవద్దర్శనముచేసి ప్రీతితో నారాధించి నిరంతరము మనస్సునఁ దత్కల్యాణరూపమును జూచుచుండువారికి మరణ మెక్కడిది? వారికి యమలోకమున జోటుండునా? యముఁడు వారిఁ గన్నెత్తియైనఁ జూడఁగలఁడా? అనఁగా వారిదివ్యశరీరము శాశ్వతమని భావము. పాంచభౌతికశరీరము స్థిరముగ నుండునా యని ప్రశ్నింపవచ్చును. అట్టివారు కోరరు. కాని వారి కింక నొక కోరికకలిగిన నీపాంచభౌతికశరీరమే యక్షయముగా నిలుచును. పరమేశ్వరుఁడు చేయఁజాలనిపని యుండునా! భక్తులు సాధారణముగాఁ గోరికకలవారు కారాదు. భగవద్దర్శనానందానుభవమే వారలకు ముక్తి. వారలే యోగులనఁబడుదురు. ధ్యేయమూర్తిని మనమునఁ గాంచుచుందురు.

"యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి." 30 అధ్యా. 6.

అన్న గీతావాక్యము కలదుకదా. భగవంతుని చెంతనుండు ననఁగా భావమేమి? కనఁబడుసకలపదార్థములు భగవద్విభూతులుగా నాతనికిం గనంబడునని తాత్పర్యము.

"ఇదం తు దుఃఖం యదనర్థకాని మే
వ్రతాని దానాని చ సంయమాశ్చ హి,
తపశ్చ తప్తం యదపత్యకారణా
త్సునిష్ఫలం బీజమివోప్తమూషరే." ౫౦

ఇదియుం గౌసల్యావాక్యమే. ఇందొక్కవిశేషాంశము కలదు. ఇందలి యపత్యశబ్దము సర్వవాంఛోపలక్షణమని యఱుంగ వలయు. ఐహికసుఖముంగోరి చేయువ్రతములు దానములు ధ్యానాదులు తపస్సు నిష్ఫలములగును. అనఁగా వానికిఁ దగినంతఫలము చేకూరదని భావము. స్వల్పసుఖముంగోరి చేయు భగవత్పూజ చవుటినేలలో నిడినవిత్తనముంబోలి నిష్ఫలమగును.

"చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ. ౧౬
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః. ౧౭
ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతం,
ఆస్థితస్స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిం." ౧౮

గీత. ౭ అధ్యా.

"విహాయ కామాన్యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్స్పృహః,
నిర్మమో నిరహంకార స్స శాంతిమధిగచ్ఛతి." ౭౧

గీత. ౨ అధ్యా.

అను నీగీతావాక్యములు నిష్కామకర్మము భగవదనుగ్రహపాత్రమని బోధించుచున్నవి. స్వార్థపరులై నిష్కామకర్మము లాచరించిననవి చవుటినేల విత్తినబీజములం బోలియుండును. ఈ గీతార్థము [illegible] రామాయణమునఁ గౌసల్యావాక్యమున మహర్షి తెలిపినసు యుండంగవలయును. ఇట్లు నిసర్గము మన కనేకవిషయములను దెలుపుచున్నది. ఇంకఁ విరువాలికథను బఠింతము.

ప్రత్యక్షముగాదా. అట్టిసత్పుత్త్రుని దోషముగాని కారణము గాని లేక లోకమున నేధార్మికుఁడు విడనాడును? శ్రీరాముని నిష్కారణముగా విడనాడిన దశరథుఁడు ధార్మికుండగునా? దుర్మతి యగుట నతనిమాటఁ బాటింపరాదు. ముదివగ్గయ్యును మరల బాలత్వమునడినట్లు కామమునకు లోఁబడియున్న రాజు శాసించినయసంగతవాక్యము రాజనీతిననుసరించి యూహించినచో నేమూఢుఁడైన మనస్సున నొప్పుకొనునా? అన్నా! రామచంద్రా! నిన్నడవులకుఁ బంపువిషయ మెవ్వరికిఁ దెలియక మును పే నాతోఁగూడి యీ రాజ్యమంతయు వశపఱచుకొనుము. ధనుర్ధారినై నేను బాహ్యమున రక్షకుఁడనై యుండఁగా యమునింబోలి యొరులకుఁ గన్నెత్తుచున్న నీకంటె విశేషపౌరుషము చూపువాఁ డీలోకమున నెవ్వఁడు గలఁడు? నీయానతి నెవ్వఁడు మీఱును? పురుషోత్తమా! ఈపౌరులు నీకుఁ బ్రతికూలమగుదానిని దేనినేఁ జేయఁబూనిరేని వారిని నానిశితవిశిఖముల రూపఱఁజేసి పురము నిర్మానుష్యముగా నొనరింతును. ఇఁక భరతునిపక్ష మూనినవారుగాని, వారికి మేలుగోరువారు మఱెవ్వరుగాని యెవ్వరైన గనఁబడిన వారినెల్ల వధించెద. మృదుస్వభావులనెల్ల గవమానింతురు. కావునఁ గాఠిన్యమూని యే పనిని సాధింపవలయును.

అన్నా! తండ్రి కుమతియై కైక ప్రోత్సహింపఁగా నామె మాటలను విశ్వసించి మనకు శత్రువై విరోధము చేయునేని అట్టితండ్రి నాలసింపక వధింతము. అంతట క్రూరకార్యమాచరించువానిని కట్టివేయుదము. ఇట్లు చేయవచ్చునా యందు వేని శిష్యుఁ గురువునకుఁ బ్రమాణము కలదు. జనకుఁడైనను గర్వించి కామములకు లోఁబడి కార్యాకార్యము తెలియంగక

హద్దుమీఱి చెడుత్రోవను ద్రొక్కినేని యాతని శిక్షింపవల
యును. మహాత్మా! ఆమాట యటుండనిమ్ము. ధర్మమునను సరించి
నీకు లభింపనున్న యీ రాజ్యమును, సహోదరుఁడు నిష్కసింపఁ
జాలుబల మేది తనకుఁ గలదని, తగినకారణ మేమికలదని
యూహించి నీకొసంగక కైకేయీ! నీయఁగోరుచున్నవాఁడు!
రాజున కట్టిబలముగాని కారణముగాని లేదు. శత్రుసూదనుఁడ
వగు నీతోడను నాతోడను కాదనక విరోధము గలిగియున్నఁగాని
భరతునకు రాజ్యమిచ్చుట కతని నేను యుద్ధకారణముకలదు!
అని పలికి కౌసల్యం గాంచి యిట్లు పలికెను.

అమ్మా! నేనును భరతునివలె స్నేహశీలుఁడ. అయిన
నాహృదయమునందు భ్రాతయగు రామునిపై ననురాగము
కలదు. ఈమాట నీయెదుట నేను సత్యముపై ధనుస్సుపై దాన
ముపై దేవతార్చనాదులపైఁ బ్రమాణము చేసెదను. తల్లీ!
మండుచుండునగ్నినిగాని యరణ్యమునుగాని శ్రీరాముఁడు
ప్రవేశించునేని నేను నతనికంటె ముందే ప్రవేశించెదనని యె
నిశ్చయింపుము. సూర్యుఁడుదయించి కిరణసమూహముచేఁ జీఁక
టంధకారము నడంచుచందమున నేనుంగూడఁ బరాక్రమమున
నీదుఃఖమును మాయింతును. నాపరాక్రమమును దేవతలును
నన్నయు నిపుడు కనుఁగొందురుగాక. అని మహాత్ముఁడగు లక్ష్మ
ణుఁడు పల్కినది విని కౌసల్య దుఃఖించుచు, నీదుఃఖములు తొలఁ
గునా యని కోరుచు రామునితో నిట్లు పలికెను. వత్సా!
తమ్ముఁడు చెప్పుచుండుపలుకుల వింటివికదా. అవి నీకు సమ్మ
తములగునేని యింకఁ జేయఁదగుపని నాలోచింపుము. నాసవతి
ధర్మవిరుద్ధముగాఁ జెప్పినపలుకు విని దుఃఖములపాలగుచున్న
నన్ను వదలి నీవిచ్చోటు వదలి పోరాదు. ధర్మముల నెఱుంగు

డువు. పరమధార్మికుఁడవగు నీవు ధర్మమునే యాచరింపవలయు నని కోరినయెడల నిందేయుండి నాకు సేవలు చేయుచు నసమానమగు నీధర్మమును సమాచరింపుము. తల్లికి శుశ్రూషలు చేయుటకంటె నుత్తమధర్మము వేఱొకటి లేదుకదా. మున్ను కశ్యపకుమారులలో నొక్కఁడు తల్లికిఁ బరిచర్యలు చేయఁదలఁచి దానిచేత మహాతపస్సును బొంది స్వర్గముఁ బ్రాపించెను. నీతండ్రి దశరథుఁడు గౌరవముచే నెట్లు పూజ్యుఁడో యట్లే నేనును దల్లి నగుటఁ బూజ్యురాలనే. కావునఁ బితృవాక్యమువలెఁ దల్లిమాటను నీ వంగీకరింపవలయును. నీ వడవులకుఁ బోవ నే నంగీకరింపను. అడవికి నీవెంతమాత్రము పోరాదు. నిన్ను నెడఁబాసిన నా కీబ్రదు కేటికి? సుఖము లేల? నీవు చెంతనుండక నే నిందు సకలభోగముల ననుభవించుటకంటె నీతోడ వచ్చి తృణభక్షణము చేయుచుండుటయు మంచిదియే. దుఃఖించుచుఁ దల్లడిల్లు నన్ను విడిచి యడవులకుఁ బోవుదువేని నే నిందే ప్రాయోపవేశముఁ బూని యన్నపానములు వదలి ప్రాణములఁ ద్యజింతును. అంతియ కాని బ్రదికియుండనోపను. నీకొఱకు నేను బ్రాణముల వదలినయెడల మున్ను సముద్రుఁడు పిప్పలాదులవిషయమున నధర్మము నొనరించి బ్రహ్మహత్యాతుల్యపాతకము నొందిన చందమున లోకములనెల్ల వ్యాపించునట్లు నీవును దుర్గతిని బొందఁగలవు.

అని యిట్లు విలపించుచు దీనురాలై యున్న తల్లిని గాంచి శ్రీరామచంద్రుఁడు ధర్మాత్ముఁడు కనుక ధర్మవిహితములగువాక్యముల నిట్లనియె. తల్లీ! నీయానతిరీతి మెలఁగవలసినదే. అట్లయ్యు నీమాటకంటెఁ దండ్రిమాట మొదటిదిగనుండును. ఉత్కృష్టమైనది. కాఁబట్టి పితృశాసనమును మీఱునంతసాహ

మంగీకరింపదు. తల్లి! లోనగువారికి దుఃఖ మొకప్పుడు కలిగినను జనకునివాక్య మనుసరించువాని కేకష్టము కలుగదు.

అని యిట్లు వాగ్విశారదులందును ధనుష్మద్వర్యులందు నుత్తముఁడగు రామమూర్తి తల్లి కిట్లుత్తరమిచ్చి యవ్వల సోదరుం గాంచి యిట్లు పలికెను. సౌమిత్రీ! నాయందు నీకుఁ గలమైత్రి యసమానము. నీబలపరాక్రమప్రతాపము లెవ్వరికి నుండవు. నా కీవిషయములు తెలిసినవే. నాయనా! నాతల్లి సత్యశాంతులస్వరూప మెఱుంగనిది. కాన విశేషదుఃఖాక్రాంతురాలయ్యెను. వానినెల్ల నెఱింగిన నీవేటికో యిట్లు పలుకుచున్నాఁడవు? సకలపురుషార్థములందు లోకమున ధర్మమే యుత్తమము. ఏటికందువో, ధర్మమునందే సత్యమున్నది. పితృవాక్యపరిపాలనముకూడ నాధర్మమునే యాశ్రయించినది. కాన దీని మిక్కిలి ధర్మము కల్గును. ధర్మమునందు నియతిగలిగి యదియే ఫలముగాఁ గోరువాఁడు తల్లిదండ్రులనుఁగాని విప్రునకుఁగాని చెప్పినట్లు చేసెదనని వాగ్దానము చేసి తప్పనగునా? అట్లే నేనుగూడఁ దండ్రికిఁ జెప్పినట్లు చేసెదనని ప్రతిన చేసినవాఁడను. కాన దానిని మీఱిపోఁజాలను. కైకయానతిగాని తండ్రియాజ్ఞ యేని? అని యందువేమొ? తండ్రిమాట ననుసరించియే కదా కైక నన్నడవికిఁ బొమ్మన్నది. కావునఁ దండ్రిని జంపి రాజ్యము నిత్తుననుదుష్టరాజధర్మము నాధారము చేసికొనిన యీదుష్టబుద్ధిని మానుము. ధర్మమునే యాశ్రయింపుము. ఇంక నిప్పుడుగాని యిట్టిప్రారంభమును బూనకుము. నాబుద్ధి ననుసరించి ప్రవర్తింపుము.

అని యిట్లు తమ్మునకు హిత ముపదేశించి మరలఁ దల్లిం గాంచి శిర స్సాను పాదములు స్పృశించుచున్ నమస్కరించి

యంజలింబట్టి తల్లీ! నేను కాననమున కరుగుచున్నాను. పోయివత్తునని యనుమతి నొసంగుము. నాప్రయాణమును మానుము. పోవలదని పలుకకుము. శుభముగాఁ బోయిరమ్మని నాకు స్వస్త్యయనముల నొనరింపుము. నా యాజ్ఞ [illegible] యని మాత్రము పలుకకుము. తొలుతఁ జెప్పిన [illegible] ప్రకారముగాఁ గాననమునకుఁబోయి నా ప్రతిన నెఱవేర్చి పూర్వము స్వర్గమును వదలి మరల దానిం బొందిన [illegible] మున నడవినుండి మరల నయోధ్య కరుదెంచెదను. అమ్మా! హృదయమున నే వగ నడంపుము. నలువురు [illegible] దుఃఖింపకుము. పితృవాక్యమురీతి వనవాసము ముగించి మరల నిచ్చటికి వత్తును. తండ్రియానతిఁ దీర్చుభారము నాకు మాత్రమే కాదు. వానిని నీవును నేనును సీతయు సౌమిత్రియు [illegible] నెఱవేర్పవలసినవారము. ఆభారము మన [illegible]. ఇది సనాతనధర్మము కాని నేనుగాఁ గల్పించినమాత్రము కాదు. ఇంక నీ వీపూజాద్రవ్యములను వదలి [illegible] నడంచికొని వనవాసమునకుఁగా నేఁబోవునపుడు [illegible] బూని నన్నుఁ బంపుము. ఈబుద్ధి పితృవాక్యపాలనరూపధర్మముతోఁ గూడినది. కావున నీకు ననువర్తింప నవశ్యము.

ఇట్లు శ్రీరాముఁ డత్యంతధర్మహితముగను మహాధైర్యయుక్తముగను దృఢప్రయత్నయుక్తముగను బలికిన విని మూర్ఛిల్లినట్లున్న యాపట్టపురాణి తెలివినొంది మరల రామునితో నిట్లు పలికెను. కుమారా! నిన్నుఁ బెంచిన మాతృధర్మమును బట్టియుఁ బ్రీతిననుసరించియు దేహసంబంధము నాశ్రయించియు నీకుఁ దండ్రి యెట్లు పూజ్యుఁడో యట్లే నేనునుఁ బూజ్యురాలనే. కనుక జనకవాక్యమురీతి జననీవాక్యము గూడ

నెఱవేర్పఁదగినదే కాని పరిత్యజింపఁదగినది కాదు. కాన, నేను నీవనగమనమునకు ననుజ్ఞనీయను. మహాదుఃఖమునఁ గ్రుంగిననన్ను విడిచి నీవుపోవుట తగవు కాదు. నీవు లేకయున్న నేనిందు బ్రదుక నేల? తక్కినవారంద ఱెందులను? పరలోకమేటికి? పితృలోకమునకుఁబోయి స్వధఁ జిక్కినను లాభమేమి? స్వర్గలోకమున నమృతము దొరకిన సద్దానిం గ్రోలినను లాభమేమి? ఆనందమునకు స్థానమగు మహర్లోకములోనుగాఁగల యూర్ధ్వలోకములఁగల ప్రాణిసంతతి యెల్ల మ్రాఁగనుపట్టినదానను ముహూర్తమాత్రము నాకొమరుని గనుసుఖమునకు సమానము కాదు. మానవు లుల్కలచేఁ బీడించి రానీక యరికట్టినను లెక్కచేయక తాఁబోయినమార్గముననే మరలఁ బ్రవేశించు మహాగజముచందమునఁ గౌసల్యయు లక్ష్మణుఁడును హితవాక్యములు పలికి వలదన్నను ధర్మమార్గముననే రాముఁడు పోవుటం జేసి తల్లి మిక్కిలి దయగలుగునట్లు విలపింపఁగా నాలకించియు మఱింతగాఁ జనునట్లు వలయునదే నిలిచియుండెను. అంత మూర్ఛమునింగినట్లున్న తల్లిని దుఃఖపీడితుఁడై యున్న తమ్ముని గాంచి ధర్మమునందే స్థిరతం గాంచియున్న రాముఁడు మహాధర్మసంకటకాలమున నట్టివారికే తగినమాటల నిట్లు పలికెను.

లక్ష్మణా! నాయందు నీకుఁగల భక్తియు నీపరాక్రమము నేను నిరంతర మెఱుంగుదును. నీవు ధర్మమునందే స్థిరుఁడవై యుండవలయునను. నాయాశయము నెఱుంగఁజాలక తల్లిం గూడి మిక్కిలి దుఃఖమునకులగుచుండినను నన్నుఁ గలవరపెట్టుచున్నాఁడవు. తమ్మా! ధర్మఫలభూతములగు సుఖములఁ గల్గించుటను పురుషులు ధర్మార్థకామములని నిశ్చయింపఁబడినవి. అప్పురుషార్థములెల్ల నాధర్మమునందే నెలకొనియున్నవి.

